# సంపాదకీయము.

సాహిత్యలత యొక్క పదునాలుగవ కుసుమము "ఆణిముత్యాలు" ఈసంయుక్తప్రచురణము నింతకన్న మిన్నగ నందీయదలచితిమి, గాని, మేమనుకొనిన పెద్దలనుండి, సకాలమునకు వ్యాసము లందకపోవుటకతన, ఇప్పటికీవిధముగ పూర్తిగావించితిమి. అనివార్యములగు ఆటంకములవల్లను, అచ్చుఆఫీసువారి లోటులవల్లను, తరుణమునకు తయారు కాలేదు. చందాదారులందరు మన్నింతురుగాక! ఆటంకము లందరికి కలుగుచుండునుగదా?

ఇందలి కవికుమారులందరు నూతనపోకడలు వింతరుచులుగల సంస్కారప్రియులు. అడిగినంతనే కాదనక, వారివారి రచనలను ప్రసాదించి, మాయుద్యమమునకు తోడుపడినందులకు కృతజ్ఞులము. వ్యాకరణాది దోషములు, అనుకూలములుగాని సమాసములు అందందుగలవు. వాటిని కర్త లెరిగియుండియే విడిచిరని మానమ్మకమగుటచేత, దిద్దబూనుకొనలేదు. నాలుగైదు అచ్చుతప్పులుగలవు. వీలున్నంతవరకు సరిజూచితిమి.

ఈ వ్యాసకర్తలలో శ్రీయుతులు వెంకట నరసింహాచార్యులుగారు, వెంకటేశ్వర్లుగారు పాఠకులకు చిరపరిచయులు. వీరి “ప్రణయవాహిని” “ధృవకుమారవిజయము” సాహిత్యలతయందు ప్రచురింపబడినవి. ఆచార్యులుగారికి ఆంధ్రాభిమానము మెండు. ఆంధ్రౌన్నత్యమును పాడుబడ్డ దిబ్బలలోను పగిలిపోయిన రాళ్లలోను చూచి విచారపడతాడు. మయూరాసనాసీనయై కోహినూర్ వజ్రముతో వెలుగుచు, సిరిసంపదలతో దులదూగుచున్న మాతను దర్శించుటకు మురియుచున్నాడు. అట్టి భాగ్యము బట్టుటెన్నడో ?

కర్షకునికర్త ఉపాధ్యాయవృత్తి నుండుటచే కొలదిగ ఉత్సాహము, తెలివితేటలు ప్రస్ఫుటికి, పరిస్థితుల ననుసరించి, అవకాశము లభించుటలేదు. ఆలోచనలు పెద్దవి-తయారైన రచనలుకొద్ది.

‘కొండవీటికొండ’ ‘వర్తాలనంది’ మున్నగు వ్యాసముల కర్త పిన్నవయస్కుడు వయసునకు మించిన తెలివితేటలు-కవిత్వమంటే ప్రత్యేకాభిమానమున్నా, అన్నిటియందు రుచులుగలవు. అసహ్యకరములైన ప్రాతమర్యాదలను ధిక్కరించి, ముందున ఉరుకవలెనని ఆలోచన. గొప్పగొప్పకార్యాలు చేయవలెనను కోరిక దైవమునుహూంపడిన, నిజము కంతవాడే. విశ్వనాథ సత్యనారాయణగారివలె వ్రాయనిరచన, తలచనిఆలోచనలేదు అప్పు

కాబడినవి స్వల్పము-కష్టముల కెదురీదదగినమేటి-కాగలవాడు. పవిత్రహృదయముతో ఆశీర్వదించుచున్నాము.

"నిర్వేదము" కర్తతో మాకు పరిచయము తక్కువ-రచన లనుబట్టి, కాలానుగుణ్యముగ వర్తించువాడని తోచుచున్నది.

'కర్మ' కర్త తెలుగుకవులన్నా, తెలుగునాడన్నా పొంగి పోతాడు. విశ్వనాథ సత్యనారాయణగారంటే ప్రత్యేకాభిమానము. నిలుకడలేనిమనస్సుగాబోలు, భాషాసేవజేయు కుతూహలముతో నాలుగైదుమార్గాలుతొక్కాడు. సిద్ధించినరచనలు బహు స్వల్పము-కాశీ హిందూవిశ్వవిద్యాలయములో బి. యస్. సి. చదివి 'స్వరాజ్య' ఇంగ్లీషు దినపత్రికకు సబ్-యెడిటరుగ కొన్నాళ్లున్నాడు. ఇప్పుడు 'లా' చదువుచున్నాడు. అభివృద్ధికి రాగల యువకులలో నొకడు.

"కబీరుగీతములు" "అమ్మ" మున్నగు రచనలు నావి. నేను పాఠకులకు చిరపరిచితుడనుగదా? నన్నుగూర్చి వ్రాసుకొనజాలను.

ఆంధ్రులీ 'ఆణిముత్యాలు' ప్రేమతో స్వీకరింపగలరని నమ్ముచున్నాము.

సాహిత్యలతకార్యాలయము, }
చీ రా ల. }

కర్లపాలెం కృష్ణరావు,
సంపాదకుడు.

# ఆంధ్రమాత.

(పరాంకుశం వెంకట నరసింహాచార్యులు, బాలసరస్వతి, శతావధాని.)

సీ॥ శ్రీయుత శ్యామల క్షేత్ర కేదారంపు
జిలుఁగు పచ్చని పట్టు వలువతోడ
తిరుశైల శ్రీశైల దివ్యన్మనోజ్ఞ మ
హోన్నత వక్షోజ యుగముతోడ
హేమముఖి పెన్న కృష్ణ గౌతమ్యాది
రమణీయ రత్న హారములతోడ
ద్రావిడ పాండ్య కర్ణాట మహారాష్ట్ర
కాళింగ ముఖ సఖీ గణముతోడ

గీ॥ పూత కమనీయ బంగళా ఖాతనీల
బహుళ వీచీకుటిల కచపాళితోడ
దర్శనం బిచ్చితివిగాదె? తల్లి! తల్లి!!
అఖిలదేశ విఖ్యాత! ఓ యాంధ్రమాత!!

ఆ ణి ము త్యా లు.

సీ॥ తెలుగు కత్తుల వాసి దేశదేశాలకు
దెల్పిన 'హంపి' శిథిలములందు
నాంధ్రభాషా సరోజాక్షి నాట్యమ్ము జే
సిన 'తుంగభద్ర' వీచికలయందు
త్రైలింగ్య సాహసధైర్యము ల్జాటిన
గణపతీంద్రుని 'యోరుగల్లు' నందు
తెనుగు శౌర్యము దిక్కుదిక్కుల నింపిన
'చాళుక్య చోడుల' చర్యలందు

గీ॥ చోద్యమగు నమరావతీ స్తూపమందు
ఆ, పు రా తన, దేవాల, యములయందు
దర్శనం బిచ్చుచుంటివా? తల్లి! తల్లి!!
అఖిలదేశ విఖ్యాత! ఓ యాంధ్రమాత!!

## ఆణిముత్యాలు.

సీ॥ ప్రథిత గోవిందధారా వర్ష దేవుని
కకుబంత జైత్ర సత్కథలలోన
తిమ్మరుసాది మంత్రిశిఖామణి ప్రభా
వాఢ్య ధీకీర్తి కాయములలోన
'పులకేశి' తులలేని బలపరాక్రమ శక్తి
గంజివోసిన కట్టుకతలలోన
నన్నయ తిక్కనాద్యున్నత కవులకో
టులు బాడినట్టి చాటువులలోన

గీ॥ రాష్ట్రకూట సైనిక చరిత్రములలోన
పాడువారిన దుర్గవప్రములలోన
దర్శనం బిచ్చుచుంటివా ? తల్లి ! తల్లి !!
అఖిలదేశ విఖ్యాత ! ఓ యాంధ్రమాత !!

ఆణిముత్యాలు.

సీ॥ రెడ్డివీరుల పాదుపడ్డ కోటలయందు
కూలిపోయిన గోపురాలయందు
జాడలేని బైరాగి శాసనమ్ములయందు
వ్రీలిపోయిన వ్రాతరాలయందు
చదునయిపోయిన జయ సౌధములయందు
నురుమైన రణ పరికరమునందు
ఖిలమైన సద్గ్రంథముల తండములయందు
పగిలి పాడైన శిల్పములయందు

గీ॥ పేరుబో 'లంజదిబ్బ'లై వెలసియున్న
బౌద్ధ సద్ధర్మ మమరు స్తూపములయందు
దర్శనం బిచ్చుచుంటివా? తల్లి! తల్లి!!
అఖిలదేశ విఖ్యాత! ఓ యాంధ్రమాత!!

## ఆణిముత్యాలు.

సీ॥ సింగంపు కొదమలో రుంగల్లు రాజపుం
గవుల గన్నట్టి బంగారు కడుపు
కోవిల్పులులా చక్రకోట్యమండల శౌర్య
నిధుల గన్నట్టి మానికపు కడుపు
శరభము ల్విజయనగరరాయ సామ్రాజ్య
పక్షుల గన్నట్టి దివ్యమగు కడుపు
పిడుగు తునకలగు బొబ్బిలి వీరవర్యుల
లీల గన్నట్టి వజ్రాల కడుపు
గీ॥ ఆ కడుపునందు నీవు నే డకట - మూఢ
భీరు దాస్యతా - ఖనులను, భిక్షుకులను
స్వల్పచిత్తుల గని గుండె బాదుకొనుచు
దర్శనం బిచ్చుచుంటివా! తల్లి! తల్లి!!
అఖిలదేశ విఖ్యాత! ఓ యాంధ్రమాత!!

## ఆణిముత్యాలు.

సీ॥ కమనీయరత్న తస్కారితమలీమస
మా కిరీటము శిరమందు వెలయ
దగ వీరసుతుల నాత్మత్యాగ మహిమాఢ్య
ల కపాల దీర్ఘమాలికలు గ్రాల
బ్రాబట్టు పుట్టంబు బహువిధ ఛిద్రద
రిద్రంబు మే నావరించి వెలుగ
శల్యమాత్రావశిష్టంబయి చర్మావృ
తంబగు నొడల కంపంబు గలుగ
గీ॥ ముక్తకచ! రాట్టకేతన భూషితకర
కమల! లజ్జావినమ్రి! దుఃఖప్రపీడ్య
మానదీనాననాంబుజ! మాదృశులకు
దర్శనం బిచ్చుచుంటివా? తల్లి! తల్లి!!
అఖిలదేశ విఖ్యాత! ఓ యాంధ్రమాత!!

## ఆణిముత్యాలు.

సీ॥ పుత్రార్తిను, రాగము, పొంగుచుండియు గన్ను
గవ నీటిచుక్కలు గ్రమ్మనేమి ?
బలవద్గళితహాస భాసురంబయ్యు మో
మున నంత దైన్యంబు బొలుచునేమి ?
కలిత మాతృప్రేమ దొలుకాడు ఫాలమ్మ
చెంత నంత విషాద చిహ్నమేమి ?
సంప్రీతి, నుబుకు వక్షస్థలో పరిచేల
మంతగా బాష్పార్ద్ర మగుటయేమి ?

గీ॥ తనయులను, మమ్ము, జడులను, దాస్యబద్ధ
జీవితుల, గాంచినందుల కీ విధముగ
దర్శనం బిచ్చుచుంటివా ? తల్లి ! తల్లి !!
అఖిలదేశ విఖ్యాత ! ఓ యాంధ్రమాత !!

ఆ ణి ము త్యా లు.

సీ॥ అనుపమ వర 'మయూరాసనా' సీనవై
శ్యామలంబగు మేని చాయతోడ
'కోహినూర్' వజ్రాంశు కోటి ప్రభోజ్వల
న్మకుట ప్రదీప్త మస్తకముతోడ
బాలారుణాంశుకప్రభ తరళితమయి
జెలువారు 'ఖద్దరు' చీరెతోడ
నాంధ్రవీరాధి వీరావళీకంఠ దు
ర్వారలంఘిత జయధ్వనులతోడ

గీ॥ క్షుత్పి పాసార్తులు లేని నీ సుతులతోడ
సిరియు సంపద విలసిల్లు గరిమతోడ
దర్శనం బిచ్చుచెన్నడో? తల్లి! తల్లి!!
అఖిలదేశ విఖ్యాత! ఓ యాంధ్రమాత!!

# కొండవీటి కొండ.

[ఎలుకలపూడి గోపాలకృష్ణరావుగారు.]

కాలూనఁగారాని ఘనశాతి జాలుల
కోట కొమ్మలు నెలకొల్పినారు
వైరి దుర్భేద్యమై వరలు కొండలయండ
పట్టణం బొండిలఁ గట్టినారు
మొక్కవోవని శిలల్ జెక్కి జక్కనిఫక్కి
జెక్కడంబులు సృష్టి జేసినారు
కొండక్రిందికి పైకి దండువోవఁగ రాజ
బాట వాటముగాఁగఁ బఱచినారు

వనము లుద్యానవనములు వనములాది
వలయునట్టి సమస్తంబు వలయునట్లు
కొండ పై భాగమందుండఁ గూర్చినారు
సాటిలేని ప్రభావంబు జాటినారు॥

ఆణిముత్యాలు.

అంతఃపుర:కాంత లలనాడు జలకంబు
లాడు చోటట నేడు పాడువడియె
అలనా డమృతతుల్యములట ఆబావులు
గుయివెట్టఁబోయెడు గూలినేడు
తరులత లలనాడు పరిపక్వ ఫలపుష్ప
భరితంబులట వంటచెఱకు నేడు
అలనాడు సంజీవి యట, యటప్రతిమొల్క
జెముడు మొక్కయె నాగజెముడో నేడు

కమల కమనీయ కమలాకర మట నాడు
మురికినీటను నున్నది చెరువు నేడు
"పూవులమ్ముచోటనె కట్టెపుల్ల లమ్ము
కరణి" ధరణినిఁదోఁచెడు కాలమహిమ!

వెండియుఁ గొండఁ ద్రవ్వి గడువింతగ బావులు దీసినారొ లా
దండిమగళ్ళశక్యము విధాతకు మించిన కార్యమట్టి దె
వ్వాండిల సేయఁగాఁగల డపారము, లోతెఱుఁగంగరాదు పై
నుండి పరీక్షసేయ, నవియుం జెడిపోయెను నేడు సూడఁగన్॥

వీటన్నాటి విరోధి వీరులట దోర్వీర్య ప్రభావంబునన్
కోటంగెల్వఁగఁ జుట్టుముట్టుకొనినన్ గోర్కెల్ వృథాయానుగా
కాటల్ సాగఁగనిత్తురే? నృపులు సైన్యంబుల్ ప్రజల్ మేటిపో
రాటంబై నను దాటనీరడుగు దుర్గప్రాంతముం డాయగన్॥

పనివడి కోటమాటునను పై కొనిరాకన, నిల్వచెల్వమై
దనరెడు సర్వ వస్తు సముదాయము తద్గిరి దుర్గమందు, దా
కిన పరరాజ్య సైన్యతతికిం దలపెట్టఁగరాని వేడ్క గా
నన——నట నేతికొట్టు మొదలైనవి నేటికిఁ గానసయ్యెడున్॥

ఆణిముత్యాలు.

ఈ వెదుళ్ళేవియో—యీలపాటలు బాడు
జగదేకవీరుల చరితమేమొ
ఈ మారుతంబేమొ—మెటిగింప యత్నించు
మండలేశుల ఘోర మరణమేమొ
ఈ కీరశారిక—లేవో పల్కులుబల్క
రాజేంద్రిరా తొంటి రాణయేమొ
ఈ చెట్లకదలిక లేమిటో సెప్పెదు
తెనుఁగుబిడ్డల శక్తి తెలియనేమొ
ఈ ప్రదేశ ప్రబోధ మిదేమొ వీర
రౌద్రరసములు హృదయాన రవులుకొలుపు
తేజ మువ్వొంగఁజేయు ప్రతిజ్ఞయేమొ
అదెగదా నీమహైశ్వర్య మాంధ్రపుత్ర!

## ఆణిముత్యాలు.

వెన్నిచ్చిపారని వీరాధివీరుల
వెన్నాడి చెండాడు వీరులుండ
రాజాధిరాజుల రాజ్యాలు చేఁబట్టి
కప్పాలు గొన్నట్టి ఖ్యాతియుండ
విజయధ్వజంబు దిగ్విజయధ్వజంబుఁగా
నాటి జాటెననాటి మాటయుండ
భాషామహాయోష బంధించి మించిన
కవిరాజు శ్రీనాథు ఘనతయుండ

లేనిదేమిటి ధరనీకు లేశమైన
వీసమైననుఁ బొంద వాయూన మపుడు
యిపుడు దైన్యంబు యెంతలో కెంతమార్పు!
"విధిని దాటంగవశమె యవ్విధికినైన!!"

# కర్షకా!

(వారణాసి వేంకటేశ్వరులు.)

ప్రొద్దునలేచి యెద్దులను బూన్చి పొలంబుదున్ని వేళకున్
జద్దిని ద్రావి జీవితము సాంతము శాంతిగఁ జేసికొందువే
పద్దులు సుద్దులున్ వినఁగఁ బొల్పడవింతయు సేద్యమున్ వినా
యద్దిర ! ధన్యజీవితము హాలిక ! నీయదియే నిజంబుగా !
"మృగశిర యేగుదెంచె నిఁక మేదిని చల్లబడున్ బునాస వే
యఁగవలె నొక్కవానకురియంగనె" యంచుఁ గుతూహలంబుతో
డఁ, గడఁగుదీవు విత్తనములన్ సమకూర్పఁగ ; నాఁటినుండియే
తగులముసెందుదీవు కృషిధర్మము నిర్వహణం బొనర్పఁగన్॥

ఎంతటి కష్టముఁ బడి స్వవృత్తి నొనర్తువు ప్రీతితోడ నీ
కంతటి సౌఖ్యమే యొదవునయ్య! యజస్రము సేద్యకాడ! గో
సంతతి స్వాదు దుగ్ధములొసంగు, ఫలించును సస్యముల్ మన
శ్శాంతిగఁ; బాడిపంట వ్యవసాయకలానిధి నీకు సొమ్ములౌ॥

తొలకరింపఁగానె దూలంబుపై నున్న
గొఱ్ఱుదింపి పసుపు కుంకమలఁది
గుజ్జువేల్పు బెట్టి కుడుము లుండ్రాళ్లను
బోసి కృషిని సల్పబోదుఁవీవు॥

భోగియెకాని, చాల ధనముంగల పెద్దయెకాని, గొప్ప యు
ద్యోగియెకాని, భూధవకులోత్తముఁడైననుఁగాని, మిక్కిలిఁ
త్యాగియెకాని, నీ కృషికి నందఱు దాసులె; నీదుధర్మమే
సాగనినాఁడు లోకములు చల్లఁగ శాంతి వహించి యుండవే!

ఆణి ము త్యా లు.

మొలకలెత్తినయంత మొదలంట నొక్కప్డు
మిడుతలదండులు మ్రింగివేయు
చక్కఁగాఁ బెరిగిన సస్యజాలము ననా
వృష్టిచే నొకపరి నెండఁజేయు
మితిలేని యతివృష్టి మెయికొని యొకవేళ
పండనుండెడి పైరు పాడుసేయు
పండినపైరును పక్షులో పురుగులో
నొకయెదనున నాశ మొందఁజేయు

తలఁప నీరీతి యీతిబాధలను దవిలి
సలిపిన కృషియంతయును నిష్ఫలమగునని
పంట నింటికి తిన్నఁగా వచ్చువఱకు
కంట వత్తివై చుకొనుచు కాచెదీవు॥

## ఆణిముత్యాలు.

సేద్యంబు నెరవేర్ప చేసిన యప్పుకై
మంచి క్షేత్రంబు లర్పించినావు
హెచ్చుపన్ను లేక యిల్లాలి మెడలోని
పూసపుట్రయు నమ్మివేసినావు
సంసారరక్షణ సలుపలేకపుడప్డు
పసులనే విక్రయపఱచినావు
గొంతుకకుఱితికై కొంపనుసైతము
బెల్పడి తాకట్టు పెట్టినావు

శాంతి సంతోషధీరతా స్థానమైన
నీదు హృదయాన చింతను నిలిపినావు
ధరలు పడిపోయి, పంటలు తరిగిపోయి,
శిస్తు పెరిగిపోవుటచేత సేద్యకాడ!

ఆణిముత్యాలు.

కన్నులపండువై కాన్పించెడి మిరప
తోఁటలు మన సీమ దాఁటిపోయె
నెంతదూరమునకో యింపైన గంధంబు
వ్యాపించు కొతిమేర రూపుమాసె
కమ్మని గోంగూర. కడు లేతవంకాయ,
తీయనిదోసయు మాయమయ్యె
నేకుంటమీఁదైన నేటేటఁబండు, గు
మ్మడి, సొర, పుచ్చ, కా పుడిగిపోయె,

కంది మొదలైన ధాన్యముల్ ముందునకును
దొరకుటయుఁగూడ నిప్పుడు దూరమయ్యె
నిన్ని పంటలు చెడిపోవ హేతువెదియొ
చేసినాడవె యోజన సేద్యకాడ!

ఉన్న దఖండభూమి, మనియున్నవి కమ్మని పంటలెల్లఁ, బై
నున్నది సాధనమ్ము, జనమున్నది ముప్పదియాఱుకోట్లు, లే
మున్నను, రైతుపోషణ, సమున్నతశీలము, న్యాయదృష్టి, లే
కున్నవి; స్వీయదేశమున కుద్ధతికల్గుట యెప్పుడో కదా!

* "బేరనుగట్టుగా మనకు వేలకొలంది ధనంబు వచ్చు" నం
చారసి విత్తమెంతయు వ్యయంబుగ దానినిఁగట్టి, భూమి వి
స్తారము సారవంతముగ సల్పి యిసీ! దొరతోఁటవేయుదే
దూరము పారజూడు దొరతోఁటలవల్ల ఫలంబు సంతయుఁ॥

తినుటకు ధాన్యముఁ మఱియుతీయనికూరలు,గొడ్లమేతయుఁ
మునుకొనినావె సుంత తలపోయుము కర్షక! యిప్పుడన్నియుఁ
గొనవలెఁగాదె ద్రవ్యమును గొల్లగవమ్మొనరించి, కాన బే
రనువలనఁ ప్రయోజనము రాఁగలదేదియొ చూడుమిత్తరిఁ॥

* పుగాకుబట్టీ.

ఆణిముత్యాలు.

"గట్టిబునాదులేసి కలకాలము నుండెడిరీతి గాతితోఁ
గట్టితి నిందులోఁ బ్రదుకుగా వసు" లంచు తుపానువీచు నా
పట్టున గట్టివై చితివి పాడగు బేరనులోన నద్దియే
కట్ట! షాకార్చ్ఛి నీపసుల కర్షక! యెంతటి పాడుబేరనో!

మీలోకొందఱు శ్రీయుతుల్ సతతమున్ మృష్టాన్నమున్ గొంచు లీ
లాలౌల్యంబున సంచరింపుచు విచారంబింతయున్ జేయరే?
చాలీచాలని యన్నవస్త్రములతో సంసార భారమ్ముతో
నాలాపించుచునుండు బీదజన దీనారావముఁ గూర్చియుఁ॥

ఆణిముత్యాలు.

# వరలనంది.

(ఎలుకలపూడి గోపాలకృష్ణరావు.)

ఒక్కఁడు బీదతనంబున
స్రుక్కుచు లక్ష్మీకృపార్ద్రి ♦ దృక్కులనోగి తా
మిక్కుటముగఁ బొందఁదలఁచి
చక్కని యొక యూహఁజేసి ♦ సత్వరమతఁడున్॥

వినుతిఁదలిర్ప మానివలె వేసము ♦ వేసి ధనంబుఁగూర్పఁగాఁ
జనిచని యొక్కచోట బహు ♦ శాసనముల్గని సంతసించి, ధా
రుణి ధనమెందుదాచినను ♦ రూపముఁజూపెడి యుక్తిప్రశ్నలం
ఘనులగువారుఁ బేర్కొనుటఁ♦గై కొని, వాని పరీక్షసేయుచున్॥

## ఆణిముత్యాలు.

కొన్నిట భూసురోత్తముల ♦ కున్నరపాలు రొసంగినట్టి యా
పెన్నిధు లగ్రహారముల ♦ పేరులు, వానికి హక్కుభుక్తముల్
కొన్నిటఁ గీర్తిచంద్రికల ♦ కూర్పులుఁ గాంచి రుచింపకున్న పే
రెన్నికఁ గొన్న శాసనము ♦ నేర్పడఁ దీసి పఠింపనందునన్॥

"గిరి" యనుదాని తూర్పున నొ ♦ గిన్ "వెలుగం"దున "నందిపాట్టిలో"
వర రవిసోమసాక్షిగ "వ ♦ రాలనుఁ" బోయడమైనదంచు యే
నరవరుఁడో రచించుట గ ♦ నంబడ, నర్థముగాక యుంటచే
నరయుచు నెల్లదేశముల ♦ యందునఁ దానయి సంచరించుచున్॥

ఒండొక కాలమట్లుతఁడు ♦ యూరుల వాడల నెల్లజాడలన్
మెండుగ సంచరించినను ♦ మించు తదర్థ మెఱుంగలేమిచే
వెండియు సంచరించుచును ♦ పిమ్మట "గుంటురిసీమఁ" జేరి యా
తండు గ్రహించెనా "గిరి" ప ♦ దంబునకర్థము "మంగళశైల" మంచటన్॥

దానికి తూర్పునన్ వితత ♦ ధైర్యయశోపరిపాక శోభితం
బై నదిగాన "నందివెలుఁగా" "వెలుగ"ర్థముగా గ్రహించి, విం
తై —నవమందహాస వద ♦ నాబ్జముతో పరికల్పితార్థుఁడై
మౌని ప్రయాణమున్ సలిపి ♦ మాపుకు "నందివెలుంగుఁ"జేరెనన్ ॥

చేత కమండలంబు నొక ♦ చేతను దండముఁబూని మేనిపై
భూతిధరించి కుండల వి ♦ భూషితుఁడై చిరు జింకచర్మముం
బ్రీతిని జంకనుంచి, ముడి ♦ వెట్టిన కెంజెడ, కాలిపుట్టముం
జేతముపల్లవించు ముఖ ♦ చిహ్నముఁ గల్గుట నూరివారలున్ ॥

యోగిచుట్టునుఁ జేరి యు ♦ ద్యోగమలర
భక్తియుక్తులఁ జూపుచు ♦ పలువురతని
కర్ఘ్యపాద్యాతి సత్కృతు ♦ లాచరించి
తోడుకొనిపోయి పురికి ♦ మాటాడకుండ॥

ఆణిముత్యాలు.

భాగవతులకు సతత ని ♦ వాసమైన
"శంకరుని దేవళంబు" ని ♦ శ్శంకఁజేర్వ,
గోపురంబంటె చెన్నారు ♦ గోపురంబు
నందు "నందినిఁ"జూచి యా ♦ నందమంది॥

వ॥ నిరంతర సంపదధ్యాన మనోరథ తరంగిణీ తరంగ పరంపరలం దవగాహించుచున్న నమ్మానియు పెన్నిధింగన్న పేదపగిది నందింగాంచి యమందానందమంది తన కపట నటనా కౌశల్యంబుం గానఁబఱచక :—

"ఓ! మహనీయులార!! తమ♦యుత్తమధర్మము మెచ్చవచ్చె,మీ రేమిఫలంబుఁ గోరెదరో ♦ యేర్పడఁ దెల్పుడు—'సర్వసిద్ధు లా స్వామి పదారవింద జప ♦ సత్వ మరందపు మాధురీవరం బా మహిమానుభావముల♦యం దలరారుచునుండు'రంచనన్॥"

వారక మానినాథునకు ♦ వారలు వందన మాచరించి, దే
వా! రఘురామలక్ష్మణుల ♦ పావనజీవన కీర్తనంబు సం
సార సముద్రముం గడువ ♦ సాయమొనర్చు "కలంబు" గాన వే
మారు భజించినన్ మనసు ♦ మారదు కౌతుకమై వెలర్చెడిన్॥

వ॥ కావునన్,—భవదీయ మంజువాగ్వైఖరులంజాటె 'శ్రీమద్రామాయణము' పారాయణముఁజేసి, మమ్ముల తరింపంజేఁగదే! యని కేల్మొగిడ్చి వేడ్కొనిన:—

మానియు మోదమంది జన ♦ మాన్యుల సంస్తుతిఁజేసి ధూపదీ
పానలముంచి భక్తివెన ♦ కయ్యనుఁగొల్చి పురాణగ్రంథముం
బూని పఠించి యర్థమును ♦ బేర్కొనుచుండిన పారవశ్యులై
మ్రానులవోలె చేష్టలను ♦ మాని చరించిరి వారలందరున్॥

ఆణిముత్యాలు.

అంత, ప్రచండభానుఁ డప♦రాబ్ధినిఁ గ్రుంకఁగ, దిక్కులెల్లనై
చింతిలఁజేసె భక్తులను, ♦ "శీఘ్రమ ప్రొద్దుగతించిపోయె నో
క్కింతఁ బురాణమాసరికె ♦ యీతనికేలనో కన్నుఁగుట్టె, యే
మంతమునింగిపోయెనని♦యాతురతంబడె?—"నంచుఁబల్కుచున్॥

విమల చరిత్రుని రఘువరు
నమలిన శుభగాత్రుఁగొల్చి ♦ యరిగిరి వేడ్కన్
తమతమ నెలవుల కప్పుడు
క్రమముగ మానీంద్రునాజ్ఞ ♦ గైకొనియుండన్॥

వ॥ ఆరేయి హానియు మిక్కుటంబైన భక్తియుక్తులం జూపుచు, పౌరులర్పించిన వివిధవిధ పరిపక్వ ఫలపుష్ప మధుర మధుర రసంబులం గడుపారం గుడిచి, శంకరుని పాదపద్మంబుల

సాన్నిధ్యంబునం దత్యంత తపోనిష్ఠాగరిష్ఠుండై, యూరుమారు మ్రోగునటు లపుడపుడు "హేః! పార్వతీపతేః!!" యని బల్కుచు, మరలఁ బుట్టిన "మార్కండేయుం"డో యన - ప్రజలకుం దోపట్టుచు, కంటిపై కూర్కుడక రేయెల్లం జాగరణఁజేసి, తెల్లవారకపూర్వమె పోయి, ఆలయంబంతయు నూడ్చి శుభ్రపఱచి, చిత్తరవులుంచి, కైలాసవాసుని మంగళశోభితాలంకృతుంజేసి స్నానమాడి, శుచివస్త్రంబులఁదాల్చి, వడలంతట నింతింతనరాని భూతిం బూసుకొని చేత జపమాలఁబట్టుక, జింక చర్మంబుపై పద్మాసనాసీనుండై, చూచువారల కనుచెదర కుదురుగా కూర్చుండెడి, శృంగార భయాశ్చర్యంబు లొక్కుమ్మడి గ్రమ్మ కన్పట్టుచున్న :—

ఆణిముత్యాలు.

తొలికోడి కూయంగ ♦ తెలవారెనని యెంచి
పనులు జేసికొనంగ ♦ జనులు లేచి
కాలకృత్యములెల్ల ♦ కావించుకొనివచ్చి
నిండారు భక్తితో ♦ దండు వెడలి
గిరి కన్యపతిఁగొల్వ ♦ నరిగి కోవెలఁజేరి
యతిదీక్షనున్నట్టి ♦ యతినిఁజూచి
"మునినాథు దర్శింప ♦ మన పాపములుబాయు
చూడరే యీభక్తి ♦ సొబగ"టంచు

భూరి పరివార సహితులై ♦ యూరివారు
యొండొరుల్ "గుసగుస"లాడు ♦ చుండిరంత
తపముఁ జాలించి మౌని సం ♦ తసము మీర
కపటప్రేమను వారిపైఁ ♦ గానబఱచి॥

## ఆణిముత్యాలు.

ఘనులార! పతిత పావనులార! జనులార!
సుజనజీవనులార! సుగుణులార!
వరకీర్తిధరులార! హరి భక్తిపరులార!
మరురూపవరులార! సరసులార!
వినుత దోర్బలులార! విజిత శాత్రవులార!
కుజనమర్దనులార! సుజనులార!
బుధులార! భూరి సత్ప్రధులాగ! సఖులార!
భూధవధృతగుణ యోధులార!

సత్యవాక్సత్య సంకల్ప సత్యకృత్య
నిర్మలానంద సంచార నియతులార!
దానధర్మపరాయణ ధనదులార!
ప్రేమ భజియింపుఁ డీశుని బ్రీతికొరకు!!

ఆణిముత్యాలు.

అని ముని యనుటను వినివిని
ఘనముగ జనులనిరి యపుడు ♦ గారవమొప్పన్
వినయ విధేయత లొలుకఁగ
మునితనయునితోడఁ బేమ ♦ మోసులిడంగన్॥

అవురా! మానికులాగ్రగణ్యా!! భవదీ ♦ యంబైన సద్భక్తి మె
లవురా! ముక్తికి భక్తియుక్తమగు, నా ♦ శాశృంఖలంబందుఁ జి
క్కవు, సంసారయగాధగాధలకు స్మృ♦క్కంబోవు, వైరాగ్యమూ
ర్తివి, నిన్నుంబొగడంగనేర్తుమె? కృతా ♦ర్థీ! యల్పులంబొటచే॥

మానివి నిన్నుఁగంట యిల ♦ మా తొలినోముల మెట్టుపంట, కా
దేని పరాత్పరుండ విల నీ ♦ యనతారము నెత్తివచ్చితో?
ధీనిధి! 'బాగుబాగు!' భవ♦దీయ మహాత్వమదేమొ మాకు సుం
తేనియుగాదు యాంకలి, యొ♦కింత జనింపదు డప్పి, మేల్భళా!!

అనుచు నారీతిఁ గీర్తించు ♦ జనుల కతఁడు,
అరయ నత్యంతయిష్టుఁడై ♦ యంతనుండి
దినదినంబుఁ బురాణంబుఁ ♦ దెల్పుచుండ
వచ్చుచునుఁ బోవుచుండిరి ♦ వారువీరు॥

వ॥ ఇట్లు కొన్ని దినంబులు గడిపి యొండొకదినాన యథాప్రకారంబు పురాణకాలక్షేపంబుఁ గావించుకొని యూరివారల మెప్పు లొప్పుగంబొంది, యెల్లరునుం బొద్దుపోవుటవల్ల గృహోన్ముఖులై జన :—

నందియొద్దకుఁ జేరి తా ♦ నందునున్న
గుర్తు లెఱుఁగగ రామిచే ♦ కోరికోరి
క్రిందుమీఁదులఁ జూచుచు ♦ గుందుచుండ
తుదకు నాతనికొక యూహ ♦ దోఁచెనంత॥

ఆణిముత్యాలు.

వేగమెబోయి పౌరులు ని ♦ వేదనఁజేసిన బెల్లమంతయుం
జేగొని నందికంతటనుఁ ♦ జెచ్చెరఁబూని పరుండ చీమలుం
బాగుగ తండతండములు ♦ పంబినవేడ్క "వరాలనంది" పై
మూగి బరాబరుల్ చెలఁగ ♦ పొంకముఁజూపి గుడంబునాకినన్॥

నందికి క్రిందుగ నొగి పది
మందికి గనరాకయుండి ♦ మైనముతో పెం
పొందిన రంధ్రము చీమల
సందడిచే బయలుపడిన ♦ సంపద వడియెన్॥

ఒద్దిక కలలందైనను
వద్దనక "వరాలనంది" ♦ వరసిరిఁగొను దు
ర్బుద్ధిఁగల మానిసత్వర
మద్దరికింజని వరాల ♦ నన్నిటిఁజూచెన్॥

చూచి, వరాలనెల్ల నొక♦చో నొనఁగూర్చుక, "యూరివారలుం
జూచిన బ్రాణముల్ నిలుపఁ ♦ జూడరు, యిందిక నిల్వరాదు మైఁ
గాచుకొనంగ నెంచునెడఁ ♦ గావున, వారలు సూడకుండనే
లేచి, ప్రయాణమౌదు"నని ♦ లీలఁదలంచి పలాయితుండుగాఁ॥

వ॥ నిత్యమట కరుదెంచెడి వారరుదెంచి, యందెందును డెందంబలరించు యోగీంద్రుంగానక యటునిటుంజూచి కటకటంబడి, తుదకు నందిదరికింజేరి, కొందరందలి రంధ్రంబందు ప్రమాదవశంబున ప్రమత్తత విడచిపెట్టంబడియున్న కొన్ని వరాలంగాంచి, నందినంతం బరీక్షించి, పొట్టంతయును లొట్టైగన్పట్ట "కట్టా!" యనుకొని, మానిమాయామహత్వసత్వంబుల కచ్చెరువడి, తమకుం జరిగిన మోసంబు మొదలంట నెఱింగి ఖిన్నులై చేయునది లేక "చేజారిన పిట్టకై చింతించినను లాభించదని" గృహోన్ముఖులైరి :—

ఆణిముత్యాలు.

“నంది” వెలుఁగంది యుంటచే ♦ నందు ప్రజలు
“నంది వెలుఁగని” కది తొలి ♦ నాటు గోత్రత
నంది వెలుఁగయ్యె—నేటికి ♦ నాటికందు
నందియున్నది దాననా ♦ రంధ్రముండె

—

# కబీరు గీతములు.

(రవీంద్రకవి కనువాదము.)

కర్లపాలెం కృష్ణరావు గారు.

## మొదటి తునుక.

శూన్యదృష్టుల నాకయి చూతువేల?
ఆలయముల, మసీదుల, నందు: నిందు,
మారుమూలల - భృత్యుడ! మానుమోయి!
నీడవోలెను నీవెంట నిలచియుంటె॥

నేను కైలాస "కాబల" గానగడను
యజ్ఞయాగాది క్రతువుల కందబోను,
అన్నియును వీడి మాడెడు త్యాగినైన
జేరగాలేదు - నేల యీ చిక్కులెల్ల?

తేరి పారగ నను మనసార జూడు
మన్య మెఱుగక - గోచరమగును నీకు
కలియుగల వప్పుడె...కబీరు పలుకు వినవె!
"ప్రాణులకు దేవుడే ప్రాణవాయువనుచు!!"

## రెండవ తునుక.

యుద్ధభటుడైన, వణిజుడు సిద్ధుడైన
గురుడయైనను, నెవడైన, కులమదేల?
అందరొక దిక్కు జేరుట కరుగుచుండ్రి,
ఏల కల్పింతువా భేద మింతలోన?

ఏది కులమని ఋషిని బ్రశ్నింపబోకు
మేదియైనను నీకేమి? యెవడవీవు?
నిశ్చయం బొక్కటేగద? నీకు, వారి,
కందరికిగూడ హక్కున్న దచటికేగ॥

ఆ వినిర్మల గమ్యస్థలాంతరమున
నంటుసొంటులులేవు హాస్యములకైన
అన్ని మతములు కోరున దదియెగాన
హిందువులెగాదు - తురకులు నేగిరటకు॥

## మూడవ తునుక.

ఇచ్ఛచే గాంచనగు, నిరీక్షించుమోయి!
ప్రాణముండగనే దాని బడయగలవు,
అర్థ మొనరించుకొనుము తత్త్వంబు మిత్ర!
మోక్ష మీ జీవితమునందె మునిగియుండె॥

ఆణిముత్యాలు.

తెలివి తేటలు, శక్తియు, గలిగియుండి,
అవయవంబులు స్వాధీనమందునున్న
సమయమున బంధముల త్రెంపజాలవేని
యింక, చచ్చిన నేమి సాధించగలవు ?
ఆత్మ లేచిన నిక పరమాత్మ యందు
గలియునని చెప్పు కథలెల్ల కలలెసుమ్మ
అతని నిటజూడ, కాంచుదు వచటగూడ,
తప్పిపోయిన యమపురి తప్పదోయి !
అమిత విశ్వాసమున గురు నాశ్రయించి
సత్యమును నమ్మి, యత్నింప సాగుమోయి !
సత్యమను నీటదిగి, సుచి స్నానమాడి
సత్యముగ లేచి యా దివ్యశక్తి గనుము॥

ఆణిముత్యాలు.

ఆత్మశక్తియె యిపుడు నీ కవసరంబు
అదియె యన్వేషణమున సహాయమగును
"నేను దాసుడ నాశక్తి" కనుచు బలుకు
ప్రేమరసమూర్తి యతడు కబీరు, కనుము॥

---

# నిర్వేదము.

(చివుకుల ఆదినారాయణ, సాహిత్యవిశారద.)

అదియొక యగ్రహారము; విహాయసమధ్యగ చండభాస్కరా
భ్యుదిత విహాతపానలము బొర్ల, వియోగిని పశ్చిమాంగనా
వదనపు టూర్పులో యనఁగఁ బైకొను నావడగాడ్పువేళ, వీ
థిఁదిరుఁగు మాలవృద్ధుఁడు పడింబడి "దాహముదాహ" మంచు
[దా॥

ఎంతసేపట్టు లఱచెనో యెఱుకలేదు
మాఱుబల్కిన మానవుం డూరలేడు;
ఏడ నీరు దొరకలేదు వేఁడుకొనిన
యలసటను స్పృహదప్పుట యయ్యెనౌర!

కన్నులు మూతలండె, పలుకంగ నశక్తత గోచరించె, యా
శోన్నతి వీరువారనుచు నూరక దిక్కులు సూచుచుండి, 'యు
న్నన్న'యటంచు భూమిఁబడి యూర్చెను వృద్ధుఁడు; అంతలోననే
కన్నులు నీరుగార తమకంబున నిట్టులఁ బల్వరించెదుర్॥

ధనముకొంత భోగులవిధంబున మేటిసుఖంబులంద, నూ
తనగృహముల్ హుళక్కి, నిజ దారసుతాదులతోడ నుండ, నే
యనువునులేదు జీవితపుయాత్ర యథేచ్ఛగ నిర్వహింప, నే
మని వచియింతు నక్కట! నిరర్థకమేయగు మాదు జన్మముల్॥

వారని కష్టముల్ గుడుచువారల స్వోదర పోషణార్థమై
క్రూరపుఁగృత్యముల్ సతము గూర్చెడువారల, నిత్యమామిషా
హారుల, తోడి మానవసహాయ విదూరుల, న్యాయరీతి, మ
మ్మారసి ప్రోవఁగానొక మహాత్ముఁడు నేఁటికి లేకపోయెనే!

## ఆణిముత్యాలు.

నిదురలేచినదాది నియమంబు బీరువో
నీర యింటింటికి నేగవలయు
నాగివారల నిగ్రహానుగ్రహంబుల
తలయొగ్గి మెల్లగాఁ దలఁగవలయుఁ
దివిరి వారలిడెడు తృణమొ కణమొ భద్ర
ముగఁ బట్టి, యింటికి పోవవలయు
తెచ్చిన కొంచెంబు దినిన బిడ్డలఁ జూచి
యూర్చియుఁ బస్తుల నుండవలయు

నిన్ని కష్టములంబడి యేడ్చుచుండి
గ్రామశిష్టుల యాజ్ఞల గడపుచుండు,
శుష్క-జీవితములఁగని శోకమందు
వారు, ముందునకై నను వసుధఁ గలరె!

### ఆణిముత్యాలు.

ఎండకాలంబున నెగయు గాడ్పుల వేడి
బడినట్టి ప్రిబలోష్ణ వాతఫలము
వానకాలమ్మున వర్షంబులంబడి
తడిసిన యట్టి శీతలఫలంబు
ఏపూటకాపూట యొంగిలియే గాని
కడుపార దినని యాకటిఫలంబు
ఋణము తీరికలేక యణువు లాభములేక
సర్వకాలంబుల శ్రమఫలంబు

కట్ట బట్టయు తిన గూడు గానబడక
వివిధ దుఃఖాలు మనమును వ్రేల్చుచుండి
తనువు వార్ధక్యభారానఁ దల్లడిల్లు
నపుడు గన్పట్టు నఖిలంబు నంతమందు॥

ఆణిముత్యాలు.

మనుజులు తామొనర్చు ననమానపు పాపము బాపుకొంటకై
యనయము దేవదేవుని మహాత్మునిఁ బ్రార్థనసేయుచుందురి, పా
పనిచయముల్ దొలంగు; భగవంతుని దర్శనమేనియుఁ లభిం
పనిగతి ధర్మముల్ నుడువువారికి గల్గునె పుణ్యలోకముల్ ?

కట్టను గుడ్డలేకను సుఖంబుగ మెక్కను దిండిలేక, యే
పట్టులనో వసింపుచును బ్రాయము సర్వము తూపుమాయ, ని
క్కట్టులనొందుచుండు మముఁగాంచదు లోక, మవెంత పాపసం
ఘట్టముల్గదా మివ్వుల గాసినిజెందెదు మాదు పుట్టువుల్॥

గాంధిమహాత్ముఁ డుండెననఁగా మనకేటికి దాస్యశృంఖలా
బంధములేటికీ స్వమతపాలక ఘోరపిశాచపాళి సం
బంధమదేటికీ సతము బాములనొందెడు జీవనంబు ; లీ
బంధనముల్ హరించి మము బాలనసేయు మహాత్ముఁడొక్కఁడే॥

# ఆణిముత్యాలు.

ఎందఱు రాజు లీభువి జనించిరి, మించిరి కీర్తిశాలురై
యెందఱు యోగిపుంగవులు ఏర్పడజెప్పిరి ధర్మశాస్త్రముల్,
ఎందఱు రాజకీయముల నింపువహించి రహించిరోకదా?
యందఱిలో నొకండును సహాయమొనర్చెనె మాదు జాతికిన్?

జానెడుపొట్టకై యిటుల జాతరలొందెడు జీవనంబిసీ!
హీనము; రాతిలోన వసియించెడు కప్పల, నీటిలోని యా
మీనములన్ సతంబును సమీక్షణజేసియు భుక్తినిచ్చు, నా
దీనజనావనుండు మము దీనుల బ్రోవడె నమ్మియున్నచో!

అందఱు దీనరక్షకుని యాత్మజులేకద! తండ్రి, పుత్రులన్
గొందఱ గొప్పగాను మఱికొందఱ నీచముగా నొనర్చునే!
యందఱ కన్ని భేదములె! యారడివెట్టుట లేలమమ్ము, మ
మ్మందఱ చెప్పరాని జనులందు రదేమిటి యగ్రవర్ణజుల్!?

## ఆణిముత్యాలు.

పరమపవిత్రమైపరగు భారతభూమిని బుట్టువోంది, యీ
ధరణినిఁగొల్లు నీరములఁ ద్రావుచు, పంటలమెక్కి యందునే
పెరిగియుఁ బెద్దవారమయి, పెంపువహించిన మమ్ము నేల, నీ
కరణి, నికృష్టులంచు కడగాఁ బడవైచెద రన్యవర్ణజుల్!

మాకును మీకునైతము సమానమె యాఁగద చావుపుట్టువుల్
మీకుగలట్టి మజ్జయును మేధయు మాంసము చీమునెత్తురుల్
మాకునుగల్గుగాదె! యిక మాకును మీకును భేదమేమిటన్
జేసిరు? నట్టిదో మము స్పృశించినదోసమె! యన్యవర్ణజుల్?

అంటిన యంతమాత్రమున యానది యేదియులేదు మాకు, మి
మ్మంటినయంతలోనె తమకయ్యెడు నష్టము గల్గబోవది
ట్లుంటకు కారణంబుగలదో మరి యింకొకటేదియైన? మ
మ్మంటిన నంటునేమిటని యారయఁగోరియె పృచ్ఛజేయుటల్॥

## ఆ ణి ము త్యా లు.

తప్పును జేయువారలు యధార్ధముగా నిరువైపులందునన్
మెప్పును గాంచలేరు, వినమేయది ! నొక్కఁడుజేయు తప్పునన్
తప్పుడుజాతియంచు మము దప్పలముంపకు డయ్యలార ! యీ
తప్పులు మీకుగద్దుగద తాల్మివహించియు యోజసేసినన్ ॥

“మతమునజేరుచో తమకు మాన్యములిత్తుము; మంచిమంచి సౌ
ఖ్యతతిని గూర్తుమం”చునడి యాసల క్రైస్తవబోధకాగ్రణుల్
సతతము జూపుచుండగ, నసహ్యతజూపుచు వారియందు, మీ
మతమును వీడకున్కఁగద మా కిటువంటి యనర్థమయ్యెడున్ ॥

బాములనొందుచుండియు స్వబాహు సమార్జిత కష్టరాశిచే
నేము మదీయ జీవములనెట్లొ భరించుచునుంటి మింతకున్
మీ మడిమాన్యముల్, ధనము, మేడలు, మిద్దెలు, వస్తుజాల మే
మీమని వేడరాముగద ! యీగతి మమ్మున నాదరింతురే ?

ఆణిముత్యాలు.

జీవులనెల్లబో మివ్వుల శ్రేష్ఠము మానవజాతియంచు, మీ
రేవచియించియుఁ బిదప "హేయముగా చరియించుచుండ్రటం"
చావల నెట్టినారు మము; న్యాయమె యొప్పదుమింత! కైన మీ
రేవిధి జంతుజాలములనే స్పృశియింతురు హేయమేఁగదా!

ధరణిసి సత్కులీనుల విధంబున మేమును జన్మలంది నా,
మరమరలేని సౌఖ్యముల నన్నిటి చిన్నతనాన పొందినా
మరుదుగ తల్లిదండ్రులచె; నోదలదాల్చితి మార్యధర్మముల్
తరుమగనేల మమ్ముఁ దమతావుల జేరగనీక నిర్దయుల్॥

పాపమొ పుణ్యమోయిటు నభాగ్యుల మమ్ముల బుట్టజేసినా
వాపయి జ్ఞానమిచ్చి యసహాయసహాయక! మానవత్వముఁ
బ్రాపుగ గూర్చియుంటి వెడబాయని ప్రేమను దీనరక్షకా!
బాపురె! యట్టి నీవాఁకా, యపావనులట్టుల మమ్మొనర్చుటల్॥

### ఆణిముత్యాలు.

"చెప్పగరానివారలు, స్పృసింపగ గూడనివారలం"చునుఁ
జెప్పెడి యన్యవర్ణజుల చిత్తము మార్పుము; కాదయేని మా
తప్పుల బారద్రోలి దురితంబుల నొందకయుండునట్లు మ
మ్మిప్పటినుండియైన సృజియింపుము "పావను"లట్టు లీశ్వరా!

# ప్రకృతిగానము.

రచయిత: వారణాసి వేంకటేశ్వరులు.

ఆ వనావృత మున్నత మానగంబు
భూరినినదాన 'ఘల్లున' మారుమ్రోసె
నొక్క మధుర మంగళగీత మున్నటుండి
తటుకునన్ దిక్తటాలు వ్యక్తమగుకతన॥

ఆయెడ నొకరసాల వృక్షాగ్రసీమఁ
జెలఁగి కోమలకంఠానఁ జెవికిఁ జవిగ
గానమహిమంబు ప్రకటించు గండుకోకి
లామృతాదుల మృదుగీతి నాలకించి
కొంకి పలుకాడఁ దోఁచకఁ గూరుచుండె॥

తీయని ఫలాలు మెసవి నాప్యాయనముగ
జిలుఁగు పలుకుల హాయిగాఁ బలుకుచిలుక
నలుకెలంకుల కలయిన యా లలితగీతి
కారసప్రవాహాన మున్కలనువైచి
తన్మయత్వాన నిశ్శబ్దతను వహించె॥

అప్పుడె కుబుసాల నూడ్చిన యహిచయంబు
ఘన ధనుర్జ్యాముక్త శిలీముఖంబుపోలె
పరుగు పరుగునఁ జనుచుండె ఫణములెత్తి;
యా మనోహర దివ్య గానామృత రస
పాన వాంఛాభిరతి హృదయానఁదవిలి॥

ఆణిముత్యాలు.

అమల వీణానినాదాన సమతకుదుర
లీలనొక దివ్యగాత్రంబు మేళవించి
సరస సంగీతనైపుణీ సరణిఁ బాడు
పాటవలె వెల్గు గీతికా ప్రసరణమున
పరిసరస్థిత పాషాణ పాళికఱగి
పాఱెనా యన నొక కొండ యేఱు, పాఱు
చుండె నాగాన మేతెంచు దండనుండి॥

వ్యాఘ్రమొక్కఁడు మృగసమూహంబుగూడి
గాన మాలించు తమిచేతఁ గాననమున
చెంగుచెంగునఁ బఱచుచుఁ జేరుచుండె
బళిర ! విమల గానామృతా స్వాదనంబు
సహజ సత్త్వ విరోధముల్ సమయఁజేయు॥

భవ్య విద్యుల్లతప్రభా పటలిఁగాంచి
కనులు మూఁతలు వడిపోవు కరణి నాదు
మానసము స్మృతిఁదప్పె నామహిత మధుర
సరస గాన సుధారసా స్వాదనమున॥

"సతత మీ కొండయందనే సంచరించు
జీవసంతతి బోషణ సేయరావె
యాశ్రితావన" యని యావనాధిదేవి
పూని ప్రార్థన జేసిన గానమేమొ!
ఏమి గానమా యని యట కేగినాఁడ
నాగిరిదరీముఖమున ఝంఝానిలంబు
సేరుచుండఁగ నొక్క విచిత్రనాద
మొసఁగి నిఖిల జీవతతి మోహింపఁజేసె
వితతమంజుల గీతికా మృతమువోలె ;
ప్రకృతిగానాన గలదెంత శ్రవణసుఖము!

# రాణీసంయుక్త.

ఎఱుకలపూడి గోపాలకృష్ణరావు.

(స్వయంవర వేదికపై 'సంయుక్త' చెలికత్తెతో)

పృథ్వీరాజులు వచ్చి రెల్లరిదె మత్ హృద్వీధిఁ గోరాడు తత్
పృథ్వీరాజిపు డేలరాడిచట నాపేరేసి విన్పింపదే
సాధ్వీ! మద్విభు డిందు నెందయిన భాస్వత్ హృద్య సంవేద్యుఁడై
పృథ్వీరాజులతోడ వచ్చునెడ నే బేర్కొమ్ము చూచాయగన్॥

ఏమి నా తండ్రిగారగు జయచంద్ర మహారాజున కతడు ప్రబల విరోధియగుటచే నాహ్వానం బంపి యేతచ్ఛుభ మహోత్సవ సందర్భనంబునకుం బిలువనంపి యుండలేదనియా పల్కుచుంటివి ?

అయ్యో ! అట్లయిన నింకెక్కడియాశ ?

శాత్రవుడైనయట్టి జయచంద్రుని పుత్రిక నోటచేత ను
క్షత్రియు డాతడిందులకు చయ్యనవచ్చుట కిచ్చగింప డే
మాత్రము వెండియుంబిలువ మానిరిగాదెన్నృపుల్ పరాఙ్ముఖుల్
మైత్రికహో మరేగతిని మానిని వీల్పడు వానిపొత్తికన్ ?

(రెండడుగులు ముందునకువైచి)

చెలీ ! ఇటురమ్మ.

ఆవీధిన్ నిలబెట్టి యెల్లనృపు లాయారీతులన్ జేసియా
జ్ఞానైదగ్ధ్యత గేలిసేయుపటమా స్వారాజ్య రాజ్యధ్వజ
శ్రీ విభ్రాజిత రాజపుత్రుడగు పృథ్వీరాజు డై నాకు మో
హావేశంబున దోపుచుండెన ? నిజంబంతా చెలీ చూడుమా ?

ఆ ణి ము త్యా లు.

ఆ! ఇల్లు దీనికై వేరుగా బ్రశ్నింపవలెనా, విరోధియగు
టంజేసి యీవిధి నగౌరవబరచుచుండిరనియా అనెదవు!

ఛీ! రసపుత్రవీరులకు సిగ్గునశించెనె వైరివీరులతో
ధీరతమై యెదర్చి తమ దివ్యయశోవిభవ ప్రభావముం
జూరగలేక పందలయి శూరత నాతని బొమ్మపైన నీ
తీరుగ జూపినారె కసిదీగ యిసీ మగవారె వారలున్॥

తమలోతాము విరోధమూనునెడ సాధ్యంబైన సాధింప స
క్రమమా యుద్ధముసేయగావలె పరాక్రపతిజ్ఞ దీపించి లే
క, ముదంబారగ సంధిజేసికొని యేకంబై మహోహైందవీ
రమణీయోజ్జ్వల కీర్తిచంద్రికల సౌరభ్యంబు నిల్పన్ వలెన్॥

కాక?

కెంటికిజెడ్డ నెత్తియగు రేవడికై వడి నాంశవీరు ప
ల్తుంటరులొంచు నొండొరులు ధూర్తుడ వీవనుకొంచు శౌర్యముఁ
మంటనుగల్పి వైరమును మానక వేపగదీర్ప లేకయుఁ
కుంఠిత ధైర్యులై యొరుల గూడుదురే తమ గుట్టుమట్టులోఁ॥

కానిమ్ము వీరలిపు డవమానపరచినను మొక్కవోవని శౌర్యాలంకృతుండౌ మన్మనోహరుని పటమునకీ పూలమాల వైచి దుర్మతుల కెల్లరకిదె తలవంపులు ఘటిల్లజేసెదగాక! మదభీష్టం బీడేర్చుకొనియెదనుగాక!

(అని పృథ్వీరాజు పటమునకు పూలమాల వైచును.)

(తెరలో)

## ఆణిముత్యాలు.

వీడె సమస్త వైరినృప వీరుల నుక్కడగింప నాజిబో
రాడెడు పృథ్వీరాజిప్పుడు రాకొమరిం గొనుపోవుచుండె వే
రాదక శౌర్యమున్నయెడ నాహవకేళిని గెల్చి యీ పెనుం
దోడుకపొండు లేనియెడ దొంగతురుష్కుల యండనుండుడీ॥

---

# ధీరోదాత్తుడగు రాజు.

కర్లపాలెం కృష్ణరావు.

“ అతడు రాజాధి రాజట-అతడు, తాను
కోరినట్టులు చరియింపగూడదంట ”
మణి కిరీటాధిపతియైన మాత్రముననె
సహజ ప్రేమానురాగముల్ సాగజనదో!

త్యాగమే ప్రేమ ప్రేమయే త్యాగమగును
ప్రణయవాహిని సరికట్టుబలము లేదు
అదితపస్సు-అలభ్య”మౌ ఆత్మబలము,
అస్త్రశస్త్రలు దానియందణఁగియుండు॥

ఆ ణి ము త్యా లు.

ప్రణయసామ్రాజ్య మందిన ప్రభువరేణ్యు
లాసపడుదురె పాపిష్ఠియవనినేల !
ఒకట లభియించినను నిల్చియుండగలరె
మనసువచ్చిన తెరగున మసలకుండ !

రాష్ట్రములబాసి కానల బ్రతుకునొకడు
ప్రాణములె గోలుపోయెడు బంటొకండు
ఎందరేగతి చరియింపరీజగాన
దాసులై ప్రేమపాశాన దగులుకొనుచు॥

తినుటకును హాయిగా దాను తిరుగుటకును
మనసు కెక్కిన యువతితో మరలుటకును
వలనుపడకుండ బంధింపబడిన మనుజ
పాలకునికన్న మేల్గాదె కూలివాడు !

సౌఖ్యమునకును స్వేచ్ఛకు జాలనట్టి
చక్రవర్తిత్వమునకన్న సన్యసించు
టుత్తమంబనియెంచిన తత్త్వవేత్త
యతడు యెంతటి త్యాగియో! అంతఘనము!

రాజ్యమును వీడిననుగూడ రాజెయతడు
ఇంక సౌందర్యరాజ్యము నేలగలడు
అత్యుదాత్తము ప్రేమదాంపత్యమెరిగి
అందగారాని భోగములందుకొనడె?

# మహారాణిపద్మిని.

ఎఱుకలపూఁడి గోపాలకృష్ణరావు.

[ 'చిత్తూరి' ప్రభువగు 'భీమసింగు' మహారాజును 'అల్లాయుద్దీను' మాయోపాయమున మార్గమధ్యమున బంధించెనను వార్తవిని యంతఃపురమున "మహారాణీపద్మిని" మంత్రితో.—]

మంత్రీ! మోసముఁజేసి ముష్కరులు సామ్రాట్టున్నానునిన్ నేఁడు నిశ్చింతంబట్టుక మండుచున్న మన యీ 'చిత్తూరి' వీరాగ్నికీలాంతంబుఁ శలభంబులై దరియఁగానాసించి "యంతఃపురఃకాంతంబుఁబమి రేనినంప" మని వక్కాణించినారంటగా?

మంత్రి:—తల్లీ! కోరినకోర్కెఁదీర నినుసద్దంబందు వీక్షించియా
'యల్లాయుద్దీ'ను మోహపారవశ కార్యారంభ సంరంభుఁడై
యుల్లంబందు కుతంత్రమొడ్డి యనుపన్నుర్వీ ధవుండేగినన్
మెల్లంగాఁ బురివీడసిచ్చి నృపునాత్మేచ్ఛందు బంధించుకన్ ॥

కన్నును మిన్నుఁగానక అకారణవైరముఁబూని వాఁడు రా
కన్నెను నిన్నుఁగోరి లయకాల విరోధ వరూధినీ పురా
భ్యున్నతి మంటగల్పునె? అయోచిత మీ రసపుత్ర పుత్రిలం
దెన్నఁడుఁగాన మిట్టిదిదె యీతని సాహసమేమిగానకో ??—॥

వీరావారమునెల్లఁ బేర్చి యిపుడా భీలోగ్ర జాగ్రన్మహో
ధీరాకారతతోడ సంగరము నుద్దీపించి వైరాటవిన్
వీరాగ్నిప్రభ బిట్టుముట్టి యవనః ప్రీత్యుక్త రక్తప్రవా
హారావంబున శాంతినొందఁగ ననఃజ్ఞాపత్ర మీయఁగదే !!—॥

ఆణిముత్యాలు.

తురకల కంఠముల్ 'నరకి' ఆయుధకోటి
తుప్పు వోవఁగ సాముఁ ద్రిప్పవలయు
యవనరక్త ప్రోద్ధితాభిషేకముచేత
జయలక్ష్మి ఘనతను జాటవలయు
సుక్షత్రియాంగనా పక్ష సౌశీల్య ర
క్షాదీక్షఁ బోషింప సాగవలయు
వైరివీరుల ప్రక్కబల్లెమా చిత్తారి
వాశిఁ బోవఁగనీకఁ బట్టవలయు
'భీమసింగు మహారాజు' పేరుచెప్పి
ముష్కరుని కుత్తుకను బల్లె మూంచవలయు
ననుచు పంతంబులాడు వీరాళియాజి
ప్రజ్ఞ సూపింతురట తల్లి! ఆజ్ఞనిమ్ము !!

రాణి :—వలదు !

అమాత్యవర్య !!

మనవారన నంతటివారెగాని యా
తులువల సంఖ్య చాలగనుఁ దోఁచెడు ! ఊరక వారికోసమై
బలగము నష్టబెట్టుకొన బాగుగనుండదు ! మారుతంత్రముల్
సలపి నృపాలుఁ దెచ్చునెడఁ జక్కబడుంగదయంచుఁ దోఁచెడున్ ॥

అదియేమన్న-తురుష్కరాజునకు "మా యంతఃపురఃకాంత మీ
మది నాసించినరీతి దాసిజన సమ్మర్దమ్ముతో వచ్చుచు
న్నదిగానన్ మరియాదఁ జేరె గయికొండం"చాశ దోఁపంగ ని
య్యదివేగం గబురంపి మంచిగను కార్యంబింక సాగించుమా !!

ఆణిముత్యాలు.

పాలకిలందు వీరులు కృపాణములం ధరియించి దాసికా
జాలముఁబోలె నుండు, భట సంఘము బోయలభాతి మోయఁగా
పాలకిలేయవో తురకపాలకు కేర్పడఁజూపి ధారుణీ
పాలకు వీడినంతటనె వైరుల నుక్కడఁగింపఁ జేయుమా !!

సామముచేత నీగతినిఁ జక్కఁబడంగలదానిఁ బాసి సం
గ్రామము సేయనేల?—బలగంబును బాయఁగనేల? మంత్రి! వా
రేమొ 'రణంబుకోత్తురది' యెప్పటికైనను దప్పదన్న, రా
నీ!—మన రాజువచ్చిన ననేకము సేయఁగవచ్చు నాజ్ఞపై !!

చిత్తము ! సెలవు !!

---

# ఆకసము!

ఎఱుకలపూడి గోపాలకృష్ణరావు.

"అద్దమున తనమోము తా నరయుటొకటి,
వనధి గంభీరరూపంబుఁ గనుట యొకటి,
ఆకసమ! నిన్ను, పరికించి యలరుటొకటి,
యెంతజూచినఁ దరుఁగని వింతలవని !!"

చక్కఁగ బొమ్మరిండ్లు పలుసారులు దిద్దుచుఁ గట్టి, బాలికల్
గ్రక్కునఁ బాడుసేయుచును గ్రమ్మరఁ గట్టుచునుందు రట్లె, నీ
వొక్కెడ దాఁచికొండ లొకచో—బహుచిత్ర విచిత్రితంబులం
బెక్కులుసూపి, వే చెరపివేతువు అంతలొ; వ్రాతువంతలోఁ॥

## ఆణిముత్యాలు.

"చూడ చూడంగ నాశలు సూపుఁగాని
చింతలారయ రాకుండఁ జేయుఁగాని
సంతసంబెంతయుం గూర్చు వింతఁగాని
అంతయు హుళక్కివందురు! ఆకసంబ!!"

ఒక్కొకవేళ ఘోరతమ ముప్పతిల గనుఁజేసి యాశలన్
సృక్కఁగఁజేతు వొక్కొకతరిన్, వెలుఁగందుచు వానిసారు పెం
పెక్కఁగఁజేతు "వాకసమ!" యింతలు వింతలు గల్గుటంగనన్
వెక్కసమొప్పు దోప దవివేకికి నేనియు, చిన్నిబిడ్డకేన్ —॥

సురపురవాసు లన్వహము సొంపలరార విహారమారయం
బరుగునఁ బోవుచోటు, హిమభానుఁడు భానుఁడు వెల్గుచోటు ను
ర్వ్యగ, గురు శుక్ర సౌమ్య శని రాహువు కేతువు లాదిగా విభా
స్వర గ్రహ తారకాతతులు భాసిలుచోటు, భవత్స్థలంబెగా?

## ఆణిముత్యాలు.

పంటపైరుల భాగ్యంబు వారిధార,
వారిధారాప్రవృష్టిన వారితముగ
యిచ్చును ఘనాఘనంబదియే—భవత్స్వ
రూపమిన్నివింతల జగతికిజూపనోపె !!

జారచోరుల గుండియల్ జారిపోవ,
ఘోరమౌ యంధకారంబు బారిపోవఁ,
గోరి ధాళధళ్యంబు లొప్పారఁజేయు
మించులలరించి సొబగు రాణించెదీవు !!

ఎల్లజీవుల ప్రాణంబు లెగసిపోవ
దిట్టతనమూను ధారుణి పట్టుఁజెదరఁ
బట్టశక్యంబుఁ గానట్టి బిట్టుపిడుగు
లోకసమ!! నీకునప్రతి మాయుధములు.

## ఆణిముత్యాలు.

అమలిన వినీలరుచిరంబు నలఁగఁగాఁ బ్ర
శాంతముగను జేతువయ్యాది సరసులకును!
భీకరారావ గర్జితా భీలలోల
ఘనఘనాఘనముంతువు కల్మషులకు!!

పాలుండాఁగవక, ఆటలాడకొంకచో బాగొప్ప నిద్రింప కే
గోలంజేసెడి బాలకుండవని జో గొట్టంగ నిజ్జాపుచో—
బాలుండాలము మాను"నాకసము!! "నీ భావంబులయ్యార్భకున్
లీలాలోలమనస్కుఁ జేయునెడ నోలిన్ మమ్ము బాలింపవే!!

---

# ఎత్తుపై ఎత్తు.

ఎఱుకలపూడి గోపాలకృష్ణరావు.

మునుపొక నాఁడసాధ్యుఁడగు పూరుషుఁడొక్కఁడు "రైలుబండిలో
జనుచును "నోట్ల" నెంచుకొన సారెకుసారెకు బల్లపైన వా
నిని, పలుచోట్ల కువ్వలుగనిల్పుచు 'డైరిలో' వ్రాసుకొంచుఁ గూ
ర్చొనె,నది యొక్క ఆంగ్లసతిజూచి మదిందలపోసె నిట్టులన్—
"ఎవ్వఁడు వీఁడు!- ఈధనము నెచ్చట తాఁగడియించి తెచ్చెనో??
ఇవ్విధి, లెక్కఁబెట్టుకొను చింతయుఁజూడ మదీయమానసం
బెవ్విధినేనివాని నిధినెల్లనుఁజల్లగ కొల్లలాడఁగా
నువ్విళులూరుచున్నయది! ఊరకఁజూచిన లాభ మేమకో??—

ఆణిముత్యాలు.

ఎక్కినబండి "ఎక్స్ప్రెసు" ఇదెచ్చట నిచ్చట నాగకుండ వే
ఱొక్కరు నెక్కకుండఁ జననోపు! ఇదేమొ? ఇతండు సూడగా
నెక్కువ తెల్వితేటలకు నెన్నికగన్న యీతండు గానటుల్
జక్కఁగఁ దోఁపుచుండె! బహు సంపదయున్నది! కన్నుఁగుట్టెడిన్
ఘనమా — ఈ — ధనమెల్ల చల్లఁగను కైంకర్యంబుఁగావించితే-
మనమా! — ఏమనుదాన? మానికపు రమ్యద్దివ్యహర్మ్యంబులన్
మనుజాధీశులు గొల్వఁజెల్వమయి సామాన్యంబుఁగానట్టి భా
మినినా భాగ్యతరంగ సంగతిలసంసిద్ధింప చే—? పెంపుగన్—"
అంచున్, సమ్మదమంది - ఆంగ్లసతి - ఎట్లాపూరుషున్ దాను వం
చింపంగల్గుదునంచు కొంతవడిగాఁ జింతించి, యద్దాని నూ
హింపం జక్కనియూహదోఁచె నపు "కొంతేనిన్ సునాయాసమీ
కించిత్కార్య, మటంచు నెంచి వడియేగెన్ వానినిం డాయగన్

ఆపెనుఁగాంచి యప్పుడతఁడాపని నాపెను—'ఔర! యీపె, ఇం
దేపనిమీఁదవచ్చినదో యేమొ?-ఒక స్త్రీకయయ్యు, యిందురా
నోపెను భీతిలేక-'ధనమో— -మనమో-'మదిఁగోర నోపునా
పాపిపురా—నమాయకుని బట్టితినంచుఁ దలంపనోపు! ఈ
పాపి! ఇదే—కనుంగొనెద! పాపముబండెను దీనికింతటన్—'

అనుచునతండు మౌనమున ఆపెనుఁగాంచని యట్టులున్న, కా
మినియును వానిఁజూచి 'ఇఁకమించినకార్యము రిత్తవోవుఁగా
వున, యిదె! వీనిసొమ్మునుఁ బొందఁగఁజూచెద'నంచుఁ బ్రేమమో
యనఁ దరిఁజేరి పైని తనయంతనె-తా-చేయివేయఁబోయినన్
చేతిని త్రోసివేసి—తనుఁజేరిన నాతనిఁబాసి పోయినం
గోతితలంచె 'సొమ్మునుఁ గాదిఁక నీతనిఁగూడ! నియ్యదే
చూత' మటంచు నాతనితో సుందరి యిట్టులబల్కె- 'ఓరి! నీ
చేతను, ఉన్న సంపదను, చెయ్యన నాకిడవేని సూడుమా!

## ఆణిముత్యాలు.

‘హ్యాటు’నుఁదీసి—చేతిగడియారము బ్రద్దలుజేసి‘బూట్సు’పై
గీటులుగీసి-‘సూటు’తొలఁగించి—‘కరల్సు’ నుగ్గులు ‘క్రాపు’పై
నీటుగదిద్దుపాపటను—నేర్పునయంగను, పాడుఁజేసి—ఈ
మోటుమనుష్యుఁడోలి నను మోహామునం జెరపంగఁజూచుచున్

‘నోటులు’దాచియుంచుట కనుంగొనియుంటను ‘సూటుకేసు’నా
‘సీటున’నున్న ‘పెట్టెలును’చేగొని, ‘యీయకయున్న చంపెదన్
‘బోటి!’ అటంచుపల్కె, నను-ముట్టఁగవచ్చె! నటంచు అర్చుచే
బూటకముల్ ఘటించి, ప్రజముంగల కీడ్చెద! ‘రైలు’ నాపెదన్
అప్పుడు, పిన్న పెద్ద ‘లవ్వురా! అబలామణి నీపె సిట్టులం
త్రిప్పలు పెట్టజూచితె?-మంది దలపోయుము! భ్రష్ట! నీవు యీ
తప్పుడుచేష్ట! నంచు మరిదప్పరు వేళాకరీతి—కాన, నేఁ
జెప్పిన చొప్పునన్ నడచి శ్రీనిడనొప్పితెఁ ముప్పు దప్పెడిన్॥

ఇట నామాటకె విల్వ! నీవిషయమో?—ఎవ్వారు లెక్కింపకే
'కుటిలా! బొంకెద వేటి'కంచు—కరముం గోపించి శిక్షింతు ర
ప్పటికైనన్ రుచిఁజూరఁగొందు విదిగో "పాపమ్మ! పోనిమ్మటం!
చిటులాడంజులకైననో! తెలుపుమీ! ఇష్టంబదెట్లున్నదో?—"
అని, ఆరాక్షసి పల్కినన్ విని, మహా ఆందోళనా మానసం
బున నాతండు చలింపకట్టులనె యాభోటిం గనుంగొంచుయే
మనకున్నన్ చెలి, వానిఁగాంచి—'ఇదియా? అర్ధంబుగా వచ్చె నీ
మనుజుండారయ మూగవాఁడగుటచే మాటాడలేకుండెడిన్॥

మూగయటంచు నెంచునెడ మూర్ఖతగాదకో, గొంతు జించుకీ
యాగడముం ఘటించి యిటులాడిన రెంటిలొ నొక్కదానికేన్
సైగనుఁ జేయకుంట, బహుశఃశా, బధిరుండనుఁగూడనేమొ? లే
కాగెశిచోటు వచ్చునటుకట్టులె వేషమువేసి యుండునో?

వేసమెవేసె, నంచు తలపెట్టిన వచ్చినదాదినుండి నా
కోసము బల్కకున్నె?-ఇదికూడదు! ఈతనిఁజూడ దేవుఁడే
జేసిన మూగయుం జెవిటి, చెప్పిడిదేమియు గోచరింపమిన్—
వేసటఁబెట్టుచుండె'నని పెద్దయు నూహనుఁజేసి' వానికిన్॥
సైగనుజేసె—'యేటికి విచారముదక్కుటు బాసలేకనో
మూగమనుష్యుఁడా! కనులుమూసుకయుండెదవేను చెప్పిన
ట్లీగలవేని—పోనిడెద ఇవ్వని-చో—ఇదే! రైలునాపఁగా
లాగెద 'గొల్సు' నంచు, చెలి, లాఘవమొప్పఁగ జెప్పుచుండినన్
మంచిది! ఎంచినట్లుఁగనె మానిని తానుఁదలంచె! మూగవాఁ
డంచును-ఇంకనాపె నిదియంతయు వ్రాయుమటంచు మోమునన్
కొంచెము సైగఁజేతునని కూర్చునియుండిన బల్లపైన చే
వంచి లిఖించు' మంచు తననంచిత కేర్పడఁజెప్పె సంతసన్—

సంతోషంబున మోసమెంచక దురాశాపాశబంధమ్మునన్
స్వాంతంబెంతయు లగ్నమైతగుల "దోర్సా" నంతయున్ వ్రాసెని
శ్చింతన్ --కాగితమందు!-ముందుగతి యోజింపంగఁబోనాడియా
వంతన్ లెక్కిడకుండ దానినిడె-వాడద్దాని వీక్షించుచున్॥
"ఓసి! దురాత్మురాల తృణమో-పణమో-నను, నాశ్రయించితే-
తీసుకపొమ్మటం చపుడె తెల్పెడివాఁడ—దురాశఁ బూని నన్
మోసముఁజేసి, దోచుకొన మోదము నొందితి వందుచేత, "పో
లీసుల" కప్పఁజెప్పెదను—లేనిచొ ఎందరికొంప లార్పెదో?-"
అని, అతఁడాడి-వెంటనె "అలారము" గొల్సునులాగె, అంత చ
ట్టున, రయిలాగె-రక్షకభటుండును "డ్రైవరు" "గార్డు" యెల్లవా
రును, దిగి—'ఏమిటం'చు పరువుల్ బచరించుచు నుండ నాతడా
పెను చెయివట్టిలాగి తన, పెట్టె దిగంబ్రజ చుట్టుముట్టినన్—

'కాంచుమటంచు, దానినధికారుల ముంగలకీడ్చి తాను వ్రా
యించిన దానిసూపి,—అది ఎట్లు ప్రవర్తనఁ జేసియుండెనో—
వంచనఁ జేసి, తానెటులఁ బట్టుకవచ్చెనో—దానినెల్ల వ్రా
యించి, 'పోలీసు' వారినిడి యేగినవారలు, ఆపెనంతటన్—

"తగినశిక్ష న్యాయస్థాన మొగియొసంగు!"
'రమ్ము! పాపాత్మురాల! గయమ్ము!' నంచు
పట్టుకొని పోయిరప్పుడు—బాడికదలి
కూతుఁ గూయుటచేతను—కోర్టుకేమొ?—

# కర్త.

దేశిరాజు కృష్ణశర్మ గారు.

కాలసంధ్యాలరోదసీ గహ్వరమున
వీచు వైశాఖి తెమ్మెర వీధులందు
ఒక భయంకరమూర్తి సద్యోవిలీన
జీవరాసుల నాప సంసేవనమున
కడుపునిండుగ త్రేన్చుచు, గడపగడప
తిరుగుచుండును రాత్రి, పొద్దెక్కుదాక॥

* * * *

ఒక నడిరేయి, జీవకళలూడ్చెడు దిబ్బ శ్మశానవాటిపై ఒకసడిలేని జీవి పడియుండెను-మండెడు మంటలందు, నాలుకలు వెలార్చి పెన్నవడలూర్చుచు కర్మము మూర్తిగట్టి, జీవిక పరిశేషముగా అనుభవింపగ మేకొనియుండె నచ్చటఁ॥

* * * *

ఆణిముత్యాలు.

అది పురిటిల్లు, జీవిత శుభాకృతి పాపని లేతబుగ్గపై
ఒదిగి రచించుచుండెను మహోదయముల్ - అది పొంచియుండి ఏ
విధమున వచ్చెనో విధి శపింపగ బాలుని ఆవులింతలో
కదిసి, విగాహమై, తనువు కాల్చినదాకను వీడిపోవకే॥

ప్రితి నిశీధతమంపు దుప్పటుల దాగి
గారడీవాని యక్షిణీ కళలరీతి
వేగుజామున తెరమంచు విధముగాగ
వెఱచి వెఱపించుచుండును విసుగులేదు॥

ఒక పెనుభూత మట్లొరసి, ఒక్కొకదెబ్బకు మంధరాద్రియే
పెకలించివైచినట్లు, తల భిన్నముగా నయినట్లు గిట్టినన్
వికలితమైన యూపులకు వేసరి, బ్రహ్మకపాలమంట, త్ర్యం
బకనిటలాగ్ని దాచిన జవంబున మానస మూగిపోయెడిన్॥

## ఆణిముత్యాలు.

మలమల మండుటెండ, నడిమంత్రపు భాగ్యము, ఏకధారగా
జలజల వర్షపాతము, ప్రశాంతములో కసిగొన్న బెబ్బుల్,
సలసల వెచ్చనెత్తురులు సాగెడు యుద్ధము, లిన్ని వేషముల్
మలసిన పాపకర్మము, విలాసములన్ విహరించు నెప్పుడున్॥

మిట్టపల్లాలు కొండలు గుట్టలందు
బ్రతుకు చావుల సకల జీవములలోన
వ్యక్తమగుచుండు కర్మ సంభవములెల్ల
కర్మయే సృష్టి, సృష్టి వికారమంత॥

ఎన్ని జన్మానుభూతుల నెఱిగిచేసి
జేసి తెలియక, పోగులై మ
హావిశాలమై ద్రోణి బ్రహ్మాస్త్రమపుడు
ఉత్తరాగర్భ వేదన నుడికినట్లు
వెంటబడివచ్చి నన్నింత నెట్టిజేసె॥

**ఆణిముత్యాలు.**

అది కరుణించెనా చరమయాతన శోభనమౌను, బుద్ధి సం
పద వికసించి లోకముల బ్రోచును కీర్తి మనోజ్ఞవల్లి దు
ర్మదులు, విమూఢులున్, పరమహానులు యోగులౌదురే
విధమున లోపమేమి గనుపించదు, సర్వము సౌఖ్యవంతమౌ॥

# అమ్మ.

కర్లపాలెం కృష్ణరావు.

"అమ్మ!" యట! ఎంతమధురమో? అర్థమెంతో?
అమిత మంగళప్రదములు - అంతకంత
కధిక కరుణాన్వితంబులై సుధలుజిల్కు-
దివ్య బీజాక్షరములేమొ? తెలియతరమె?

ఆకలియు దప్పులును దీరు "అమ్మ" యనిన
అంత మహిమాస్పదంబులా యక్కరములు
మరణయాతన బొందెడి మనుజుడేని
స్మరణమాత్రాన నానంద శరధిదేలు॥

ఎడద లుప్పొంగ, అనురాగ మినుమడింప
"అమ్మ" యనుమాట నోరార యనగలేని
జీవియేపాపి—అతని వీక్షించువారి
కన్నమే బుట్టదానాడు అవనియందు॥

## ఆణిముత్యాలు.

అమ్మ మనసార బెట్టిన నమృతమగును,
అది మహాశక్తినిచ్చును - అందరాని
ఒకవి నూతనతేజంబు నొసగగలదు,
దానికీలోకమున సాటి గానరాదు॥

సూర్యచంద్రాదు లరుగుట - చుక్కలెల్ల
వెలుగుచుండుట - జీవులు పెరుగుచుంట
కన్నిటికి హేతుభూతము "అమ్మ" యేమొ?
"అమ్మ" యనుమాట కర్థము త్యాగమేమొ?
ఇన్ని యననేల, అమ్మ దుఃఖించెనేని
రాజులును గీజులునుగూడ రాలిపోరె?
ఆ మహాసాధ్వి కన్నెఱ్ఱయైన యపుడు
జగములేలేవు, సర్వము సమసిపోవు॥